ఓం

౦౧౦

శ్రీ గురుభ్యోనమః

# శ్రీ మదభినవ దీక్షితీయే ఉపాసనాకాణ్డః



వేదాంత సరస్వతీ బిరుదాఙ్కితేన

నరసారెడ్డ్యాఖ్యేన విముపా విరచితః

సికింద్రాబాదు పుర్యాం

శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ వాస్తవ్యైః

శ్రీ మద్దయానంద రాజయోగి వర్యైః ప్రకాశితః

ప్రొద్దుటూరు పుర్యామ్

శ్రీ వీరహనుమాన్ ముద్రాక్షర శాలాయామ్

ముద్రాపితః

15-8-1955

ఓం

౦౦౦

శ్రీ గురుభ్యో నమః

# శ్రీ మదభినవ దీక్షితీయే ఉపాసనాకాణ్డః



వేదాంత సరస్వతీ బిరుదాఙ్కితేన

నరసారెడ్డ్యాఖ్యేన విదుషా విరచితః

సికింద్రాబాదు పుర్యాం

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ వాస్తవ్యైః

శ్రీ మద్దయానంద రాజయోగి వర్యైః ప్రకాశితః

ప్రొద్దుటూరు పుర్యామ్

శ్రీ వీరహనుమాన్ ముద్రాక్షర శాలాయామ్

ముద్రాపితః

మూల్యం: 3-0-0

# పీఠికా

సర్వాణ్యపి సాధనా న్యాముష్మికాణి రూపతో విభిన్నాన్యపి, అనుకంపా సంవలితాని, సౌభ్రాత్ర సంవాసితాని, నైకవిధ మంత్రానుష్ఠాన పరాయణాని, సిసాధయిషితార్థ సంపాదన రేఖా సముల్లసన తంతు సంస్యూతాని, పరమార్థత స్సమానాన్యేవ దరీదృశ్యన్తే. సర్వాణ్యపి పాపా నపాకుర్వతే; యతన్తే మానస స్థిరీకరణస్య కృతే; సాధయన్త్యైహికం జీవనం దివ్యజీవన సదృశం "సత్యం శివం సుందరంచ" ఈప్సన్తే సమధికా మాముష్మిక సుషమాం; మన్యన్తే గుణకలాపాంచలమేవ ఛాత్రజన సముద్ధరణే ప్రధానం నిదానమ్.

ఆంధ్రదేశే సుప్రతిష్ఠితేషు ఉచ్చావచే ష్వాధ్యాత్మిక సాధనా మార్గే ష్వన్యతమోయ మచలమార్గ స్సుప్రతిష్ఠితో వరీవర్తి శ్రీవేమన యోగ్యుపజ్ఞ మాత్మజనిః, శివరామ దీక్షితేన పరిపోషం లభమానా, గుణపరం పరయాచ సమ్యక్ప్రచాలితేయం సంస్థా, సమార్జయంతీ సమధికాం విఖ్యాతిం తెలంగాణాయాం, విచిన్వానా సాధకాన్ నిఖిలేభ్యోప్యాంధ్ర కోణేభ్యః, రచయంతీ అన్యమతదుర్వాద నిర్వాపణం, సంపాదయంతీ సయుక్తికంవాదసామంజస్యం, పరిపాలయంతీ సమ్యానతయా, అసమానతయాచ అద్వైతవాద చాతురీం, బౌద్ధ ధర్మ దీక్షా మాధురీంచ, సర్వపథా తీతా జేగీయతే.

సర్వేష్వపి సాధనేషు గురోః స్థానం నితాన్తం మహీయతే. అవాప్త సర్వవిజ్ఞాన విశేషోఽపి సాధకః గురుం వినా సంప్రదాయం నాధిగచ్ఛతి; నవిజానీతే సాధనా కర్మమర్మ; నాకలయతే సమీహితార్థ స్వరూప నిరూపణమ్. అత ఏవచ యథార్థ విజ్ఞాన విశోభిత ఇతి నపార్యతేవ క్తుమ్. అత స్సాధక మాత్రస్య గురుర్న కేవల మావశ్యకః; కింతు, ఆముష్మిక యాత్రాయా ఏకైక మవలంబనమపి. సాధన ప్రణాళీ నిర్దేశం, సమ్యగ్గమన భాగధేయ స్సోపాయం. అభిలషితార్థ సంసిద్ధి హేతుం, గురో ఋతే కుత్రవా లభామహే?

గురు స్త్రిమూర్త్యాత్మకః, సాక్షాత్పరబ్రహ్మేతి ప్రచక్షతే విచక్షణాః, గురో స్సన్నిధి రేవపునీత మాశ్రమతలమ్. తదీయ శాంత మధుర ముఖసందర్శనే నైవ ఛాత్రహృదయే ఆనంద మరందధారా ప్లావః. తదీయః పరిసంగ ఏవ శ్రుతికలిత జటిల విషయ విభేదన వివరణ భాష్యమ్. తదనుసరణ మేవ నవ్య దివ్య సమాదర్శభూత జీవితానుభవః. తదాశిష ఏవ ఛాత్రస్య శ్రీరామరక్షా. తత్పాద సంసేవనమేవ కైవల్యమార్గే వినిహిత దివ్యజ్యోతిః. కింబహునా? గురు రేవ గురునిధానం సాధకస్య.

గురుః స్వీయం తేజోఽణుం ఛాత్రస్య మూలాధారే నిక్షిప్య, మహానిధే స్తస్య అమూల్యాని భాగధేయాని యథావకాశం; యథాకాలంచ శిష్యాయ ప్రయచ్ఛేత్. తస్యైవ

III

విజ్ఞాన సాంతత్య లబ్ధయే సర్వై రపి ప్రకారై స్సహాకుర్వన్, పరిపూర్ణతాం కాంక్షమాణః, అంతతస్తం 'ఆత్మాన' మారాధయతి. అత ఏవాచార్యః మధుర మధురేణ భావేన, అనుకంపా శీతలేన కటాక్షేణ, మృదు మోహనేన స్పర్శేనచ - అంతేవాసినం సంసాధ్య పరిపూర్ణం, స్వీయాం దైవీం ప్రకృతి మావిష్కరోతి; స్వమహాత్మ్యాయా నిదర్శన మప్యాదత్తే.

విచారితేచ యాథార్థ్యే-ఛాత్రిం వినా గురురప్యపరిపూర్ణ ఏవ భాసతే. "ఆచార్యః పూర్వః పక్షః" 'అంతేవాస్యుత్తరః పక్షః' ఇతి శ్రుతి రపి - ఉభయ విశిష్టాయా ఏవ మూర్తేః విశిష్టతాం ప్రతిపాదయతి; సాకల్య మాకలయతే. యదాచ గురుః స్వీయం విజ్ఞానం ఛాత్రే సమర్పితం, సమ్యక్ప్రరూఢం. స మేధమానం వితత కుసుమితంచ పరికల్పితుం శక్నుయాత్ తదైవ చరితార్థతా మాపద్యతే. తదైవ స్వీయబోధనా నైపుణ్యే స్వరూపం విజానీయాత్. ఛాత్రిం వినా కుత్రవా లభేత గురుః స్వీయ విజ్ఞానస్య యథార్థతాసంపాదనం? గురోః స్తాదృశోత్తమావకాశ ప్రదాతా శిష్యోపి స్వయమాచార్యతా మావహతి. తథైవ వోచ్యతే ఆంధ్రైం "గురుశ్శిష్య శ్చాస్తే,పరివహతి ఛాత్రో గురుపదం" ఇతి, అతఏవాత్మ విజ్ఞాన సౌవర్ణ రేఖా సౌభాగ్య విస్తృతయే, ఆచార్య స్స్వయమన్విష్యన్ ఆపాండతే నికషరూపం వినీతం ఛాత్రిమ్. 'నరత్న మన్విష్యతి మృగ్యతేహి తత్' ఇతి కవి సూక్తి నాత్ర సంఘటతే.

గురుపూజా విధానేచ దృశ్యంతే నైక విధాః ప్రభేదాః. కాయేన, వాచా, మనసాపి విధీయతే తదీయా పరివస్యా షోడశభి రప్యుపచారైః సమభ్యర్చ్యతే భవ్యాతదీయా భౌతికీమూర్తిః మనోహరైః సుకుమారార్ద్ర విభాసురైః. హృద్యభావామోదవాసితైః, దివ్యా తదీయా ప్రస్తూయతే మూర్తిః వాక్సుమైః స్థిర నిశ్చలేన, తదేకాభిముఖేన ప్రణయభాసితేన మానసేన విధ్యాయతే నిష్కళంకం ప్రభాభాసురం తదీయం తేజోరూపమ్. 'కాయేనవాచా మనసాపి సమ్యగ్యత్సంభృతం పూర్ణ గురోః ప్రపూజనం' తదేవ ప్రశస్యతే, భక్తా అపి సాధకాః గురావేవ శరణాగతిం విందంతి. జ్ఞానావలంబినోఽపి ఆత్మాభిన్నమేవ గురుం సమాలోచయంతి. "జానామి ధర్మం నచమే ప్రవృత్తిః, జానామ్యధర్మం నచమే నివృత్తిః" ఇతిభాగవత్ ధర్మం మనఃపీఠ సంసక్తం విరచయ్య, సర్వధర్మాన్ పరిత్యజ్య, గురుమేవ సంసారసంతరణోపాయంభజంతః, స్వీయం జన్మకర్మ భారం తస్మిన్నేవ నిక్షిప్య, ఉపాసతే సాధకాః తేషామేవా విచలిత మార్గాణాం, ప్రగాఢ విశ్వాసినాం, సంభృత ప్రణయానాం శరణాగతిః ఆచార్య సముపనా విధానస్య పరాకాష్ఠేతి నిశ్చప్రచమేతత్.

ప్రథితస్యాస్య చాచల మార్గస్య నిష్కృష్ట శాస్త్రీయానుపూర్వీ సంపాదనాభారః సాధకవరేణ్యానాం సర్వేషాం భుజస్కంధే వర్తతే అధునా ధ్రియమాణః అనుబంధనిబంధన

గ్రంథ నిర్మితి ప్రయత్నశ్చ ఆమోదస్య పరమాం సీమాన మారోహయత్యస్మాన్. అభినవదీక్షిత స్యోపసనాకాండవిషః గురోః స్వరూప నిరూపణం విరచయన్, గురోర్మాహాత్మ్యసం ప్రకటీకుర్వన్ గురుపూజావశ్యకతాం ప్రపంచయన్, పూజా పద్ధతిం వివృణ్వన్ షోడశోపచార ప్రచార ప్రక్రమం విశద యన్, అనుభూయ మానాన్ ఫలవిశేషాన్ సమాకలయన్ లలిత లలితేన పదబంధేన, కుసుమ సుకుమారేణార్థ విశేషేణ మాధుర్యాంచితైః హృదయంగమైర్భావవిశేషైః ప్రీణ యతి రసికాన్ నితాంత ముపకరోతిచ సాధకజన సార్ధాయ అశాస్మహేచ న కేవల మచల మార్గానుగామిభిః కింత్వన్యై రప్యాద్రియేత సుకృతినః కృతి రియం సుకవితా లాలసైః మోదామహే దీక్షితస్య నవ్యార్థకల్పనా సంకల్పేన. అను మోదామహేచ విరచ్యమాన మేతాదృశం గ్రంథ నిబంధ నమ్. నిరీక్షామహే చతీనక్రిష్మ ఫలితేభ్యః, లలిత లలితేభ్యః తదీయ గ్రంథ విరచనేభ్యః.

అమృతపురి
24-3-53

విద్వాన్
నా॥ వేంకటేశ్వర శాస్త్రి

# అచలధ్వజప్రార్థనా

అచల కేతనం త్వమున్న యాఖిలాసు దిక్షుత
త్సుచరిత! పరిపూర్ణతత్వ శోభితం మహోన్నతమ్॥
అచలపూర్ణ బోధరూప మంచితాత్మభాసకమ్.
సచివ! సర్వకర్మ తంత్రజాల హారణ కారణమ్॥

జనన మరణ మోహరహిత చరిత తత్వబోధకమ్
అనుపమాన మూర్తిమంత నఖిలలోక దీపకమ్॥
దివకరేందువహ్ని మధ్యదేశ సుగమ తేజసమ్
సనకయోగిమాని బృంద సన్నుతం సమంజసమ్॥

వ్యోమపవన వహ్ని వారి భూరి సర్వభువన స
త్సోను భాస్కరాత్మ మధ్యసాక్ష్మగం నిరంజనమ్॥
కామ లోభమత్సరాది కలుషమూల భేదనమ్
నామ రూప వర్జితం సనాతనాచలాన్వితమ్॥

ఘోరపాప వనజదూర కుముద బాంధవోపమమ్
ధీర రాజ యార్యయోగి దేశికేంద్ర వర్ధితమ్॥
సూరిబృంద భాగ్యబాహ్య శోధనం వివేకదమ్
నారసింహ రచితబోధ సారర్ణ పూర్ణసంపదమ్।



శ్రీ మదచల్షి పూర్ణగురు వేమనయోగి

ప్రశంస.

# నవరత్న పద్య హారము.

కం॥ పృథివికి జలమున కగ్నికిఁ
బ్రథితంబగు వాయునకు బాహ్యాభ్యత
ర్గ్రథితంబగు నాకసమున
కధిపతియగు గురుని మూర్తి కంజలి గూర్తుఁ.

సీ॥ వినయాశ్రమంబున వివిధశిక్షణ లంది
యోగివై త్యాగివై యొప్పినావు;
అచలర్షి యగు శ్రీదయానందుల భజించి
పరిపూర్ణ భావంబు బడసినావు;
"రాజయోగీయ సద్గ్రంథంబు" "వేమవి
లాసంబు" లెన్నియో వ్రాసినావు;
ప్రొద్దుటూరున వేమ భూపాలు వ్యాజాన
నుపపీఠము న్నిల్పనోపినావు;

తే॥ గీ॥ అహహా యభినవ "దీక్షితీయంబు" భక్తి
వ్రాసి పీఠకైంకర్యంబు చేసినావు;
రమ్ము నేడు "వేదాంత సరస్వతి" యను
బిరుదుగైకొను గురుల్ పేర్మి నొసఁగ
నరసరెడ్డీంద్ర! కడివేటి శరధిచంద్ర!

క॥ పరుసంబగు పదజాలము
చిరసంబగు భావయుక్తి వినఁబడదుగదా!

సరసంబగు నీకవితను;
పరమసుఖోద్యంబు చెవులపండువు సుమిత్రా!

తే॥ గీ॥ అతఁడభినవ పోతన యనఁగ నొప్పు
నతఁడె యభినవ దీక్షితుఁ డనఁబొసంగు
నతఁడు మఱియు వేదాంత సరస్వతి యనఁ
గీర్తిఁగాంచుత రాజయోగీంద్రు కృపను.

తే॥ గీ॥ ఆంధ్ర గీర్వాణభాషల నంతకృషిని
నెపుడు సల్పితివో సుకవీంద్ర! యింత
మధుర మధురాతి మంజుల సుధను గ్రక్కు
కైతసేయ నేర్చితి వనర్గళముగాఁగ.

ఆ॥ వె॥ వేషభాషలందు విధినిషేధములందు
విద్యయందు బ్రహ్మవిద్యయందుఁ
గర్మయందు బ్రహ్మకర్మలయందున
బళిర! సుకవి! నీవు బ్రాహ్మణుఁడవు.

క॥ పొన్నాల రాజయోగికి
నన్నా! నీకావ్యకుసుమ మర్చనకాగా
వెన్నిచ్చి పారకున్నే;
సున్నామై యెఱుక జూడ సుకవివతంసా!

సీ॥ పంచభూతములఁ బ్రపంచితంబై విశ్వ
మ్ముత్పత్తి స్థితిగతుల్ వొందెనెందు;
నవ్యక్త మహదాద్యహంకారమై యొప్పి
జీవేశ్వరాఖ్యలఁ జెలఁగనెద్ది;
ద్వైతవిశిష్టాది భావంబులకు నెల్ల
పరమాశ్రయంబగు భావమెద్ది;
హరి హర బ్రహ్మాది సురసంఘములుగూడఁ
గొలిచెడి గుహ్యాతి గుహ్యమెద్ది;

తే॥ గీ॥ యట్టి గురుపాద పంకేరుహమ్ము మిమ్ము
నాయురారోగ్య భోగ భాగ్యమ్ము లొసంగి
కడకుఁ బరిపూర్ణ రాజయోగంబుగూర్చి
కరుణనేలుత కడివేటి నరసరెడ్డి.

తే॥ గీ॥ ఇట్టి సుకవీంద్ర చంద్రుఁడవీవు నీకుఁ
గానుకగా నెద్ది యొసఁగంగఁగలను నేను?
రమ్యమగు నవరత్నహారమ్ము దక్క
స్వీకరింపంగదే కడివేటి సుకవి!

మకాం
సికింద్రాబాదు
17-5-54

ఇట్లు,
భవదాత్మీయ సోదరుఁడు
ఇలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు,



శ్రీ మహర్షి విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు,



శ్రీమతి నాగలింగం వియ్యమ్మ గారు,
(శ్రీ మహర్షి ధర్మపత్ని)

# శుభాశిషః

మహాదిద మానందస్థానం యత్కూడి వేటి నరసారెడ్డి చిరాయు-అభినవ దీక్షితీయస్య రచయితా-ఆసీదితి. యద్యపి-ఇదంకృత్యం సాహసమూ భాతి. అథాఽపి పరిపూర్ణే బ్రహ్మణి యోజితాత్మనః అస్యకించిత్కరమేవ-ఆసీత్ వస్తుతః-అయం నాతీవ కృత పరిశ్రమః శాస్త్రభాగే. తదాఽపి స్వానుభవే నైవ విదిత సకల శాస్త్ర రహస్యస్య అస్యలేఖనీ-అకంఠితేవ కావ్యరచనాయాం. వాణీచ - అస్యశాస్త్ర గంధసువాసితా శ్రోతృహృదయ హారిణీచ-ఆభాతి. వినయ మధురోజ్వలః-అయం స్వపవిత్రభావేన సర్వత్ర సర్వమపి గురుమేవమనసా భావయన్ స్వావిదిత విషయజాత లేశతః కణశశ్చైవ పరిగృహ్ణాతి. సర్వదా-ఆత్మాన మజ్ఞం చిన్తయన్నయం లోకం ప్రబోధయతీవ మార్గోపేతా భవంతు శాస్త్రవిషయే. ఇతి గురోరను గ్రహాత్-భవతా దయం శతాధిక గ్రంథకర్తా. ఇష్టదేవానుగ్రహాచ్చ స్వాదయం చిరంజీవి-ఇత్యాశాస్మహే

భావనారాయణ
సంస్కృత కళాశాల
(ప్రిన్సిపాల్) ప్రధానాధ్యక్షః
పొన్నూరు
మన్మథనామ సం|| వైశాఖ బ||౧౦

ఇత్థం
చల్లా సత్యనారాయణ శాస్త్రీ



శ్రీమ దనసూయాంబికా సమేత అచల పీఠాధిప సద్గురు
శ్రీమద్దయానంద పొన్నాల రాజయార్య రాజయోగీంద్రులవారు.

# ఇష్టదేవతా ప్రార్థనా

శ్రీలీలా విఖ్యాతా
మూల వివేకస్య హేతు భూతంతమ్
బాలం గిరిజా శివయోః
మూలధారస్థితం భజే దేవమ్
మహాదేవం పూర్ణభావమ్
పాలిత గణనికరం పరిస్తుత మౌని ప్రకరమ్
లాలిత శ్రుతిముఖరం లావణ్యాన్విత సుకరమ్॥
బాలచంద్రబింబధరం భాసురం నిగమాంతసారమ్
కాల కామ సంహారం కరివదనం లంబోదరమ్ ॥నమో॥

భాషా యోషే! లలితే!
భూషాత్మకే! పూర్ణతత్వబోధతత్వా
దీషణ నాశే! వందే!
దోషాగ్ర విదగ్ధతుముల దూరే! త్వా!
భజేహం శిరసానత్వా
శోషిత పాపమాలే! శోభితకుసుమమాలే!
దూషిత కామకాలే! పోషితభక్తజాలే!
రోషలేశ నాశని! రూపజిత విబుధేంద్రాణి!
తోషితముని వరాధుని! ద్రుహిణదివ్యవాఙ్మేవాసిని! ॥

మాతా పితరౌ! వందే
సీతాంబా వేంకయ్యార్య చిమూర్తౌ!
పూతచరిత్రౌ! ప్రణతిమ్
పాతక నాశౌ! కరోమి భక్త్యాఽహమ్
ప్రస్తుత సుజనవ్యూహౌ!
వీతలోభమాత్సర్యౌ! విమల సుగుణగణధుర్యౌ!
చేతన నిశ్చలచర్యౌ! శ్రితజన రక్షితకార్యౌ!
ఖ్యాతసకల శుభదౌ! కవికోవిద చిత్తవిదౌ!
నీతివిచార ప్రసాదౌ నిజపరిపూర్ణాచలబోధౌ!





— కృతికర్తృ జననీజనకులు —

సీతాంబా వెంకారెడ్డి

పుణ్యదంపతులు.



గ్రంథకర్త

శ్రీ వేదాంత సరస్వతి, అభినవ దీక్షిత సరసకవి

కడివేటి నరసారెడ్డి

ం ఓ ం

౦౧౦

శ్రీగురుభ్యోన్నమః

# శ్రీమదభినవదీక్షితీయే

## ఉపాసనాకాణ్డః



అభినవదీక్షిత సరసకవి

కడవేటి నరసారెడ్డికవినా

విరచితా

# శ్రీమదభినవ దీక్షితీయే ఉపాసనాకాండే

## గురుపరంపరాధ్యానమ్.

★★★★★★★

### -: తాత్పర్యము :-

అనాది యోగవిద్యగా నున్నదియు, పరమానందమును బోధించునదియు, శాంభవీ స్వరూపిణియు, నా తల్లియునగు సీతాంబను గూర్చి నమస్కరించుచున్నాను. ౧

అజ్ఞానమూలమును నశింపఁజేయువాఁడును, శుద్ధసత్త్వమగు శివస్వరూపుఁడును యశోనిధియు, నా తండ్రియునగు వేంకాదీక్షిని గూర్చి నమస్కరించు చున్నాను. ౨

రామచంద్రవంశమను సముద్రమునకు చంద్రునివంటి వాఁడును. రుద్రాక్షభూషణముల ధరించినవాఁడును, భస్మము లందిన ఫాలముగలవాఁడును, ఉత్తమశిష్యులపోషించువాఁడును, కొనియాడఁదగినవాఁడును-గురుశ్రేష్ఠుఁడునునగు వేంకట రామ శాస్త్రిని గూర్చి నమస్కరించుచున్నాను. 3

ం ఓం ం

౦౧౦

# శ్రీమదభినవదీక్షితీయే
# ఉపాసనాకాండే గురుపరంపరాధ్యానం

—: మాతృదేవతాస్తుతి :—

అనాదియోగ విద్యాంచ
కేవలానంద బోధినీమ్
సీతాంబా మాతృజననీమ్
శాంభవీ రూపిణీంభజే. ౧

—: పితృదేవతాస్తుతి :—

అజ్ఞానమూల హారణమ్
శుద్ధసత్వం శివాత్మకమ్
వందేహమాత్మ జనకమ్
వేంకయార్యం యశోనిధిమ్ ౨

—: పూర్వగురుస్తుతి :—

శ్రీరామచంద్రా న్వయవార్ధి చన్ద్రిమ్
రుద్రాక్షభూషం ధృతభస్మఫాలమ్
సచ్ఛాత్రిపోషం గురురాజమీడ్యమ్
భజామ్యహం వేంకటరామశాస్త్రిణమ్. 3

శ్రీ చందలూరీ నగరాధి వాసినీమ్
హరిప్రియా మాశ్రిత ముక్తిదాయినీమ్
శృంగార గాత్రీం ఘనపాపహర్త్రీమ్
నమామి లక్ష్మీం మమ చిత్తలక్ష్యమ్. ౪

శ్రీ లక్ష్మీ హృత్కమలస్య
ప్రకాశనరవి ప్రభమ్
గురురాజంమనస్పద్మే
లక్ష్మీనారాయణం భజే. ౫

నాగలింగ మహో వార్ధి
శశి సంభావయామ్యహమ్
మహర్షిం దేశికేంద్రంచ
శాస్త్రిణాం వేంకటేశ్వరమ్ ౬

—: అచలగురు పరంపరాధ్యానం :—

శ్రీ దక్షిణామూర్తి గురుం నమామి
నిర్వ్యాస నామహాన సమిష్టి దృష్టిమ్
నిరస్త సందేహ విశుద్ధపూర్ణమ్
శ్రీ విష్ణుబ్రహ్మా మర బృందవంద్యమ్ ౭

చందలూరీపురమున నివసించునదియు విష్ణువునకు - ప్రియురాలును, ఆశ్రితులకు ముక్తి నొసఁగునట్టిదియు శృంగారమగు శరీరముగలదియు, పాపములనశింపఁజేయునదియు నగు శ్రీమహాలక్ష్మినిగూర్చి నమస్కరించుచున్నాను. ౪

శ్రీలక్ష్మీదేవిమొక్క మనోంబుజమును వికశింపఁజేయుటయందు సూర్యునివంటివాఁడును, గురుశ్రేష్ఠుఁడును నగు లక్ష్మీనారాయణశాస్త్రిని గూర్చి నాహృదయమునందు సేవించుచున్నాను. ౫

నాగలింగ వంశమను సముద్రమునకు చంద్రుని వంటివాఁడును, మహాత్ముఁడు దేశికేంద్రుఁడునునగు వేంకటేశ్వరశాస్త్రిని గూర్చి నమస్కరించుచున్నాను. ౬

నిర్వ్యాసనా మానముచేత సముత్పన్నదృష్టి గలవాఁడును, సందేహ రహితమగుబట్టుబడులు గలవాఁడును, విష్ణు బ్రహ్మేశ్వర బృందముచే సన్నుతింపఁబడు వాఁడును నగు శ్రీదక్షిణామూర్తి గురువును గూర్చి నమస్కరించు చున్నాను. ౭

ఓంకారమూర్తిం హరి మప్రమేయమ్
శంకా విహీనం నిగమాన్త వేద్యమ్
పూర్ణం విశుద్ధం పురుషోత్తమాఖ్యమ్
భజామి నారాయణ దేశికేన్ద్రమ్ ౮

కాలాత్మకం కాలగతి స్వరూపమ్
కాలత్రయే ప్రజ్వల చిత్ప్రకాశమ్
అజ్ఞానతామిస్ర వినాశితేజసమ్
ఆదిత్య మస్మద్గురు మానతోఽస్మి ౯

సాత్త్వాగమా కల్పన పద్మ సంభవమ్
స్వప్రజ్ఞయా ధిక్కృత పూర్వ దేశికమ్
విదగ్ధ శాకల్య కుమార దక్షిణామ్
సమాశ్రయేహం సద్గురు యాజ్ఞవల్క్యమ్ ౧౦

జీవేశ్వరాభేద సమష్టి తత్త్వమ్
విదేహ కైవల్య మహాత్మ్య సిద్ధిమ్
సచ్ఛాస్త్ర వర్గాయుధ దాయకం సదా
గురుం మహాన్తం జనకం నమామి. ౧౧

ఓంకారమే స్వరూపముగాఁ గలవాఁడును, సర్వపాపముల హరించువాఁడును, ప్రమేయదోషరహితుఁడును, సందేహశూన్యుఁడును, వేదాంతములచేఁగొనియాడఁదగు వాఁడును పరిపూర్ణుఁడును, పరిశుద్ధుఁడును, పురుషోత్తముఁడను పేరుగల నారాయణదేశికేంద్రునిగూర్చి సేవించుచున్నాను. ౮

కాలమే ఆత్మగాఁగలవాఁడును, కాలాగమన స్వరూపుఁడును, మూఁడుకాలములయందు నధికముగాఁ ప్రకాశించు జ్ఞానప్రకాశముగలవాఁడును, అజ్ఞానమను చీకటిని పోఁగొట్టఁదగిన తేజస్సుగలవాఁడును, సద్గురువుననగు సూర్యునిగూర్చి నమస్కరించు చున్నాను. ౯

క్రొత్త వేదమును సృష్టించుటయందు బ్రహ్మతో సమానుఁడును, తనప్రజ్ఞచే సత్కరింపబడిన మొదటి గురువుగం వాఁడును, పాండిత్యబలముచే విదగ్ధ శాకల్యకుమారు రక్షించినవాఁడుననగు యాజ్ఞవల్క్యగురువునుగూర్చి నేను నమస్కరించు చున్నాను. ౧౦

జీవేశ్వరుల కభేదమగు సమష్టితత్త్వమును, విదేహకైవల్యసిద్ధిని శిష్యబృందమునకు నిచ్చుచున్న వాఁడును, గురువును, మహర్షియునగు జనకునిగూర్చి నమస్కరించుచున్నాను. ౧౧

దేహాత్రయాతీత వివేక లక్షణమ్
విదేహ యోగీంద్ర పదారవిందే
భృంగాయమానం శుకరాజ యోగినమ్
మద్దేశికేంద్రం హృది భావయామి ౧౨

ఉపాధియుగ్మోద్ధృత దోష సహ్నమ్
నిగ్మాల కంబోధ సుధాకరేణ
శక్తిద్వయాతీత మనోజ్ఞమూర్తిమ్
నమామి సాందీపని దేశికేంద్రమ్ ౧౩

జగద్గురుం కృష్ణమఘారి మీశమ్
గీతాఖ్య పీయూష రసప్రదాయ
లోకత్రయ స్యోద్ధరణే ప్రవృత్తమ్
శ్రీరుక్మిణీ ప్రాణ విభుం నమామి ౧౪

శ్రీకృష్ణదేవస్య ముఖాద్రి కందరా
గ్గీతా పరివాహేణ వినిస్సృతేన
ఆర్ద్రీకృతో యస్య మనఃప్రదేశో
నమామితం చార్జున దేశికేంద్రమ్ ౧౫

మూఁడు శరీరముల కతీతమగు వివేక లక్షణము గల వాఁడును, విదేహ యోగీంద్రుఁడగు జనక చక్రవర్తియొక్క పాద పద్మము నందు తుమ్మెదగా నున్నవాఁడును నా గురువు నగు శుక యోగిని గూర్చి నమస్కరించుచున్నాను ౧౨

ఉపాధిద్వయదోషమును నగ్నిబోధమును నమృతధారచే నార్చినా వాఁడును. పరాపరములగు శక్తిద్వయముల కతీతుఁడును, మనోజ్ఞమూర్తియు దేశికేంద్రుఁడునునగు సాందీపని మునిని గూర్చి నమస్కరించుచున్నాను. ౧౩

గీతయను నమృత రసముచే మూఁడు లోకములనుద్ధరించుట యందు ప్రవృత్తి గలవాఁడును, రుక్మిణీదేవికి ప్రాణ విభుఁడును, జగద్గురువును నగు శ్రీకృష్ణ భగవానునను నమస్కరించు చున్నాను. ౧౪

శ్రీకృష్ణభగవానుని యొక్క ముఖమను కొండ బిలము నుండి బయలుదేరిన గీతాప్రవాహము చేత నెవని మనః ప్రదేశము తడుపఁబడినదో అట్టి గురువునగు నర్జునుని గూర్చి నమస్కరించు చున్నాను. ౧౫

బ్రహ్మానందగురుం నమామి శిరసా భద్రాసనే సంస్థితమ్
సచ్చిత్సౌఖ్య నిరాసకం శ్రిత జనస్వాతంత్ర్య సంధాయకమ్
నిత్యం నిర్మల మప్రమేయమలఘుం నిర్మూలమోహోద్ధతిమ్
నిర్ధూతాధిక ఘోరతాపనివహం నిర్వాసనా ఖేలనమ్ ౧౬

ఆమూలాగ్రాభిజ్ఞో ప్యఖిల నిగమజ్ఞో హార్దశోకా ద్వ్యపిజః
క్షేమస్థైర్య శ్రీదో జిత బహువివాదస్సనకామోదబోధః
ప్రేమా ప్రేమాతీతో విమలగుణజాతో దేశికేంద్రప్రపూతః
రామానందస్వామిన్, విజిత నిజకామిన్, రక్షకం త్వాం
నమామి. ౧౭

అజాత భూమీరుహమూల వాసం
అజాత తత్త్వామృత బోధనేన
ఉద్ధారకం ఛాత్ర సహస్రకస్య
జ్ఞానేశ్వరం దేశికమానతోస్మి ౧౮

భద్రాసనమునందుఁ గూరుచున్న వాఁడును, సచ్చిదానందముల నిరసించినవాఁడును, ఆశ్రిత జనులకు స్వాతంత్ర్యమిచ్చువాఁడును, నిత్యుఁడును, నిర్మలుఁడును, అలఘుఁడును మోహాటోపముల నరికట్టిన వాఁడును, భయంకరమగు సర్వతాప సమూహముల నణచిన వాఁడును, వాసనారహితమందు సంచరించు వాఁడునునగు బ్రహ్మానంద గురువును గూర్చి శిరస్సుతో నమస్కరించు చున్నాను. ౧౬

సర్వము సమగ్రముగా నెఱిఁగినవాఁడవును, సర్వవేదములఁ దెలిసినవాఁడవును, మోదఖేదముల నెఱుగనివాఁడవును, క్షేమస్థైర్యసంపదలనిచ్చువాఁడవును, జయించఁబడిన వివాదములు గలవాఁడవును, సేవకులకు సంతోషమగు బోధ గలవాఁడవును, ప్రేమాప్రేమలకు నతీతముగానున్నవాఁడవును, పరిశుద్ధమగు గుణసమూహముగలవాఁడవును, గురుదేవుఁడవును, పవిత్రుడవును, జయించఁబడిన నిజకామముగల వాఁడవును నగు నో రామానంద స్వామీ! రక్షకుఁడవగు నిన్ను గూర్చి నమస్కరించు చున్నాను. ౧౭

అజాతమను చెట్టు మొదట నివసించు వాఁడును, అజాతమగు తత్త్వామృత బోధచేత నుద్ధరింపఁబడిన వేలకొలది శిష్యులు గలవాఁడును నగు జ్ఞానేశ్వర దేశికులగూర్చి నమస్కరించు చున్నాను. ౧౮

అచలబ్రహ్మ విశేషబోధనిలయం హ్యానంద సంధాయకమ్
పరమానంద విచారమగ్నహృదయం బ్రహ్మణ్యసంసేవితమ్
సహజానందగురు ప్రభుంబుధవరం సచ్ఛాత్రబృందావనమ్
మనసాసంతతమానతోస్మి కవిసన్మాన్యంకృపావార్ధిమ్, ౧౯

ప్రభూతషడ్భావ వికారదూరమ్
అజాతమాయోత్థిత సన్నివేశమ్
నమామ్యహంజ్ఞాన పురస్సరంతమ్
రామావధూతం గురురాజమౌళిమ్, ౨౦

భక్త్యాంబికా శివగురుప్రభు మప్రమేయమ్
సంసారఘోర తమసోంతక మర్కభాసమ్
దిక్కాలవస్తుగుణకర్మ విభాగశూన్యమ్
వందేహమాత్మని నిరంతర మప్రతర్క్యమ్. ౨౧

అచలమగు బ్రహ్మయొక్క విశేషబోధకు స్థానముగా నున్నవాఁడును, ఆనందమును నిచ్చు వాఁడును, పరమానంద విచారములలో మునిగిన హృదయము గలవాఁడును, బ్రహ్మజ్ఞులచేఁ సేవింపఁబడువాఁడును, పండిత శ్రేష్ఠుఁడును, శిష్య బృందమును గాపాడువాఁడును, కవులచే సన్మానింప దగిన వాఁడును, దయాసముద్రుఁడునునగు సహజానంద గురువును గూర్చి మనస్సుతో నెల్లప్పుడు నమస్కరించు చున్నాను, ౧౯

మితిమీరిన షడ్గోర్కర వికారముల దూరమొనర్చు వాఁడును. పుట్టఁబడిన మాయోద్ధతియొక్క సన్నివేశము గల వాఁడును, గురురాజమాళియు నగు నా రామానధూతను గూర్చి జ్ఞానపురస్సరముగా నమస్కరించు చున్నాను. ౨౦

ప్రమేయాది దోషములు లేనివాఁడును, సంసారమను భయంకరమగు చీకటిని బోగొట్టుటయందు సూర్యునివంటి ప్రకాశముగల వాఁడును, దేశకాలవస్తుగుణ కర్మములను విభాగములు లేనివాఁడును, ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలుగానివాఁడునునగు నంబికాశివగురుప్రభునిగూర్చి భక్తితో నిరంతరము నాయాత్మయందు నమస్కరించుచున్నాను. ౨౧

త్రిలింగ దేశస్థితి మోహపఙ్కమ్
పరిక్షాళ్యసమ్యఙ్నిజ బోధవారిణా
ఉద్ధర్తుమైచ్ఛత్ నిజదేశికోయః
నమామితం వేమనయోగిపుఙ్గవమ్. ౧౨

నిరస్తమాహామయ మద్వితీయమ్
నిరీహపూర్ణాచల తత్త్వదర్శినమ్
నిరంజనం వేంకయనామ దేశికమ్
నమామ్యహం భక్తిపురస్సరంతమ్. ౧౩

కదాప్యజన్యం సుజనైకమాన్యమ్
వాచామగమ్యం నిజబోధరమ్యమ్
ఆచార్యవర్యం తిరువెంగళార్యమ్
నమామిధన్యం కవిలోకగణ్యమ్. ౧౪

రజస్తప్రవృత్త్యుద్ధత హేతుదూరం
విజాతిజాతి స్వగతాదిశూన్యమ్
నిజనిర్బోధానల దగ్ధపాతకమ్
భజేగురుం శ్రీధర రాజయోగినమ్ ౧౫

తెలుఁగు దేశము నందున్న మోహమను రొంపిని నిజబోధయను నుదకముచేత లెస్సగాఁబోఁగొట్టి ఏసద్గురుస్వామి ఉద్ధరింపఁగోరుచున్నాఁడో అట్టి వేమనయోగిని గూర్చి నమస్కరించు చున్నాను. ౨౨

మోహమను రోగమునుబోఁగొట్టిన వాఁడును, అద్వితీయుఁడును, ఊహించరాని యచలపరిపూర్ణతత్త్వమును దర్శించిన వాఁడునునిరంజనుఁడునగు వేంకయ యను పేరుచల దేశికుని గూర్చిభక్తిపురస్సరముగా నమస్కరించు చున్నాను. ౨౩

ఒకప్పుడును బుట్టనివాఁడును, సుజనులకుముఖ్యుఁడుగాఁ బూజ్యుఁడును, వాక్కునకందని వాఁడును, నిజప్రబోధ యందు మనోహరత్వము గలవాఁడును, ధన్యుఁడును, కవి లోకముచేఁ గొనియాడఁదగినవాఁడును, ఆచార్యశ్రేష్ఠుఁడును నగు తిరువెంగళార్యుని గూర్చి నమస్కరించు చున్నాను. ౨౪

రజోగుణప్రవృత్తిచే నతిశయించుచున్న కారణమున దూరముగా నున్నవాఁడును, స్వజాతి విజాతి స్వగతాదులు లేని వాఁడును, యదార్థప్రబోధచే తగులఁబెట్టఁబడిన పాతకములు గలవాఁడును నగు శ్రీధర రాజయోగి గురువును గూర్చి నమస్కరించు చున్నాను. ౨౫

భవనార్థి శోషక మహోజ్వల బాకబాస్కిమ్
శశినంచ రామడుగు వంశే మహాబ్ధిజాతమ్
శివరామదీక్షిత గురుప్రభుమాత్మ మూర్తిమ్
నిరతం నమామి మనసా శిరసాచలక్షిమ్ ౧౬

శుద్ధబ్రహ్మ స్వరూపం సురమునినివహాస్తోత్ర సత్ప్రవృత్తిమ్
కారుణ్యా స్ఫారదృష్టిం ఘనతర విభవంకర్తృకర్త్రాదిశూన్యమ్
కంబాలూర్యప్పయార్యం కవిజనవినుతం కామదం దేశికేంద్రమ్
వందే తన్మాత్రదూరం పరమశివదం పావనం చిత్ప్రకాశమ్ ౧౭

సీతారామగురుప్రభుం పరశురామాఖ్యాన్వయాం భోసభో
సంజాతేందు మనోజ్ఞమూర్తిమతులం సంపూర్ణ శాంతాన్వితమ్
సత్యజ్ఞానమనంతమన్వయ మిదం బ్రహ్మేతివాక్యస్య స
ద్భావాతీత నిజప్రబోధ ఫలదం వందే గురూణాం గురుమ్ ౧౮

సంసారమను సముద్రమును గోషింపఁజేయుటకు గొప్ప ప్రకాశవంతమగు బాడబాగ్నియు, రామునగు వంశమను సముద్రమునఁబుట్టిన చంద్రుఁడును, ఆత్మమూర్తియు, సచలక్షియు నగు శివరామదీక్షిత గురుప్రభువునుగూర్చి యెల్లప్పుడు మనస్సుతోడను, శిరస్సుతోడను నమస్కరించుచున్నాను. ౨౬

శుద్ధబ్రహ్మస్వరూపుఁడును, దేవతామునిబృందముచేఁ గొనియాడఁదగిన సత్యస్వభావుఁడును, దయచే తడ్పినైన దృష్టిగలవాఁడును, గొప్ప వైభవము గలవాఁడును, కర్తృత్వ కర్మత్వరహితుఁడును, కవిజనముచే గొనియాడఁబడువాఁడును, కోరికలనిచ్చువాఁడును, సద్గురువును, తన్మాత్రల కతీతుఁడును, పరమ స్వరూపమగు మంగళము నిచ్చువాఁడును, పావనుఁడును, చిత్ప్రకాశుఁడును నగు కంబాలార్యస్వామిని గూర్చి నమస్కరింతును. ౨౭

పరశురామవంశ సముద్రమునఁబుట్టిన చంద్రునివంటి మనోజ్ఞస్వరూపుఁడును, సాటిలేనివాఁడును, సంపూర్ణమగు శాంతితోఁగూడుకొన్న వాఁడును, "సత్యజ్ఞాన మనంతమ్బ్రహ్మ" అను నీవాక్యముయొక్క భావమున కతీతమగు నిజప్రబోధ ఫలమునిచ్చువాఁడును, గురువులకు గురువును నగు సీతారామగురుప్రభువునుగూర్చి నమస్కరించుచున్నాను. ౨౮

భాగవతాన్వయవార్ధిసుధాకర పావన సన్మునికృష్ణగురో
త్యాగసమాహితచిత్తవికస్వర సర్వబుధార్చితపాద విభో
సాగరతుల్యగభీర నమామి సదాశ్రితపాలన పాదయుగమ్
ఆగమశాస్త్రయథార్థవివేకిన పూర్ణవిబోధ సుధాలహరే.—౨౯

రాగమత్సరాది దూరయోగరాజ్యపాలకమ్
నిత్యసత్యశుద్ధబుద్ధ నిర్వికారనిశ్చలమ్
పుణ్యరూపకేవలాత్మ పూర్ణతత్త్వబోధనమ్
శీలభాన లక్ష్మణార్య సద్గురుం నమామ్యహమ్. ౩౦

సూరిబృందసేవితాంఘ్రి పద్మయుగ్మ సచ్చిదా
నందవేంకటేశ్వరా వధూతదేశికేశ్వరమ్
వందనీయ శిష్యచిత్తవారి జాతఖేలనమ్
తం నమామి పూజ్యభావ పూర్ణబోధసంపదమ్. ౩౧

భాగవతాన్వయమను సముద్రమునకు చంద్రునివంటి వాఁడవును. పావనుఁడవును, మునిశ్రేష్ఠుఁడవును, త్యాగము తోఁగూడుకొన్న చిత్తమును వికసింపఁజేయు వాఁడవును, సర్వాంగీణులచే సన్నుతింపఁబడు పాదములుగల వాఁడవును, ప్రభుఁడవును, వేదశాస్త్రములయందలి యథార్థముయొక్క విచక్షణగలవాఁడవును, పూర్ణబోధకు అమృతతరంగమువంటి వాఁడవును నగునో కృష్ణదేశికా! యెప్పుడు నీపాదయుగ్మమునకు శిరస్సుతో నమస్కరించు చున్నాను. ౨౯

రాగమత్సరాదులకు దూరమైన యోగిరాజ్యమును పాలించువాఁడును, నిత్యసత్య శుద్ధ బుద్ధ నిర్వికారములచేత నిశ్చలమైనవాఁడును, పుణ్యరూపమగు కేవలాత్మయొక్క పూర్ణతత్త్వమును శోధించిన వాఁడును నగు శ్రీబుభానులక్ష్మణార్య దేశికులనుగూర్చి మ్రొక్కుచున్నాను. ౩౦

నమస్కారము నొసంగుచున్న శిష్యులచిత్తపద్మమునందు క్రీడించుచున్నవాఁడును, పూజ్యభావమును పూర్ణబోధసంపద గలవాఁడును, పండితబృందముచే సేవింపఁబడుచున్న పాదపద్మముల జంటగల సచ్చిదానంద వేంకటేశ్వరావధూత గురువునుగూర్చి నమస్కరించుచున్నాను. ౩౧

శ్రీమంధిప్పల వంశవార్ధి శశినం శిష్య వ్రజోద్ధారకమ్
భూమానందమహర్షి పుంగవమహం పూర్ణస్వరూపం భజే
భావజ్ఞం నిజదేశికం హృది హనూమద్రాజయోగీశ్వరమ్
సారాసార వివేకభావ నిపుణం సమ్యక్ప్రబోధస్థితమ్. 3౨

పొన్నాలవంశ కలశాంబుధి కైరవాప్తమ్
పూర్ణందయానిధి మనంతగుణైకధిష్ణ్యమ్
రాజాధిరాజముకుటాంచిత రత్నసేవ్యమ్
శ్రీరాజయోగి హనుమంతరత్నం నమామి. 33

అనసూయాంబికాం దేవీం
గురోః శ్రీ రాజయోగినః
పత్నీం శ్రీ మాతరం భక్త్యా
వందేహమ్మానసాంతరే. 3౪

ఇత్యభినవదీక్షిత నరసకవి నృసింహాత్మజ కృతౌ శ్రీమదభినవ దీక్షితీయే ఉపాసనాకాణ్డే గురుపరంపరాధ్యానం నామ ప్రథమోధ్యాయః.

మందిప్పలవంశాంబునిధికి చంద్రుఁడును, శిష్యసమూహమును నుద్ధరించువాఁడును, భూమానందమహర్షి శ్రేష్ఠుఁడును, పూర్ణస్వరూపుఁడును, భావమెఱిఁగినవాఁడును. నిజదేశికుఁడును, సారాసారవివేకభావమునందు నిపుణుఁడును, లెస్సయగు పరిబోధయందున్నవాఁడునునగు హనుమంతరాజయోగినిగూర్చి నమస్కరించుచున్నాను. ౩౨

హొన్నాలవంశమను పాలవెల్లికి చంద్రునితో సమానుఁడును, పూర్ణుఁడును, దయానిధియు, అనంతగుణములకు స్థానభూతుఁడును, రాజాధిరాజులయొక్క కిరీటములందలి మనోజ్ఞరత్నములచే సేవింపఁదగినవాఁడునునగు రాజయోగిగురువును గూర్చి హృదయమునందు నమస్కరించుచున్నాను. ౩౩

గురువగు శ్రీరాజయోగియొక్క ధర్మపత్నియు, మాకు తల్లియు, దేవియునగు శ్రీఅనసూయాంబికనుగూర్చి నమస్కరించుచున్నాను. ౩౪



# శ్రీమదభినవదీక్షితీయే
# ఉపాసనాకాండే శ్రీగురుకల్పం

—০০:৹:০০—

శ్రీరాజయోగీశ్వర దేశికేంద్ర!
ఆదౌ గురుధ్యాన మహం కరోమి;
తవ ప్రసాదా త్ప్రవచం ప్రవక్ష్యే
వదామి పశ్చాద్ధృదయం గురోశ్చ. ౧

ధ్యాత్వా పురా దేశికరాజచంద్రమ్
తద్విన్యాసే న్యస్య తతశ్చ పశ్చాత్
స్మృత్వా గురో శ్శ్రీహృదయం తతశ్చ
మంత్రం జపే త్స్వగురునాథ దివ్యమ్. ౨

ఆదౌ గురుధ్యాన మహం కరోమి
భజే సహస్రార సహస్ర పత్రే
మహాసనే స్వస్తిక నామధేయే
సింహాసనే రత్నమయే నిషణ్ణమ్. 3

అత్యంతసౌందర్య విశేషభాసురమ్
బ్రహ్మామరేంద్రేశ కిరీట కోటినా
సంసేవనీయాంచిత పాదుకా ద్వయే
సంలగ్న పాదాంబుజ మంతరే భజే. ౪

మంగళప్రదుండవగు నో రాజయోగీశ్వర! ఓ దేశిక స్వామి! నేను గురుధ్యానమును మొదట చేయుచున్నాను. తరువాత తమయనుగ్రహమువలనకవచమును జెప్పుచున్నాను. పిమ్మట గురుపాదుకయమును జెప్పుచున్నాను. ౧

ముందుగా సద్గురుస్వామిని ధ్యానించుచున్నాను. తరువాత సద్గురుకవచమును విన్యాసమొనర్చుచున్నాను. అనంతరము శ్రీగురుపాదుకయము తలంచుచున్నాను. పిమ్మట సద్గురు మంత్రము జపమొనర్చుచున్నాను.

మొట్టమొదట నేను గురుధ్యానము చేయుచున్నాను. సహస్రారకమలమందు స్వస్తికమను పేరుగల మహాసనమగు రత్నమయ సింహాసనమునఁగూర్చున్న శ్రీగురుదేవుని సేవించుచున్నాను. 3

మిక్కిలి సౌందర్య విశేషముచేఁ బ్రకాశించునట్టియు బ్రహ్మేంద్రాదులయొక్క కిరీటసమూహముచే సేవింపఁబడిన మనోజ్ఞమగు పాదుకలజంటను దాలుచుకొన్నట్టి శ్రీగురు పాదాంబుజమును మనసునందు భజించుచున్నాను. ౪

గోధూమ గర్భోన్నత జంఘభాగమ్
మనోజ్ఞజానుద్వయ శోభనీయమ్
మత్తేభశుండాభ నిజోరుయుగ్మమ్
మద్దేశికేంద్రం హృది భావయామి. ౫

మృగేంద్ర మధ్యాకృతి సూక్ష్మమధ్యం
పీతాంబరాచ్ఛాద కటి ప్రదేశమ్
నవాబ్జసంశోభిత నిమ్ననాభిమ్
భజే మనోంతే నిజ దేశికేంద్రమ్. ౬

వలిత్రయోపేత సమున్నతోదరమ్
మహాకవాట ప్రవిశాల వక్షసమ్
మహేంద్రచాపధ్వజ హస్తయుగ్మకమ్
వరప్రదం శ్రీగురు మానతోస్మి. ౭

చిన్నామ ముద్రాభయ ముద్ర ధారిణమ్
రత్నాంగులీయం కటకాంగదాంశ్చ
ధరంత మత్యద్భుత దివ్యకాంతిమ్
వందే త్రిరేఖాంకిత చారుకంఠమ్ ౮

గోధుమ గర్భమువలె నున్నతములైన పిక్కలజంట గలవాఁడును, మనోజ్ఞమగు మోకాలిజంటచే నొప్పువాఁడును, మదపు టేనుగు తొండముతో సమానమగు తొడలజంట గలవాఁడును నగు నా దేశికేంద్రుని హృదయమునందు భావించుచున్నాను. ౫

సింహమధ్యాకృతివలెనున్న సూక్ష్మమైన నడుముగలవాఁడును, పీతాంబరముచేఁ గట్టఁబడిన కటిప్రదేశముగలవాఁడును, గ్రొందామరవలె ప్రకాశించుచున్న లోతైన బొడ్డుగలవాఁడును నగు నిజదేశికేంద్రుని నా మానసాంతమునందు సేవించుచున్నాను. ౬

మూఁడు ముడతలతో గూడుకొన్న గర్భభాగము గలవాఁడును, గొప్పకవాటమువలెనున్న విశాలమైన వక్షస్థలముగలవాఁడును, ఇంద్రధనస్సునొక్క ధ్వజమువలెనున్న చేతిజంట గలవాఁడును, వరములనొసగునట్టి (శ్రీ)గురువును గూర్చి నమస్కరించుచున్నాను. ౭

చిన్మామముద్రను అభయముద్రను ధరించినవాఁడును రత్నపుటుంగరమును కడియములును భుజకీర్తులును ధరించినవాఁడును, మిక్కిలి అద్భుతమై ప్రకాశించు కాంతి గలవాఁడును, మూఁడు రేఖలచేనొప్పుచున్న మనోహరమగు కంఠము గలవాఁడునునగు గురునకు నమస్కారము. ౮

సుపక్వబింబాధర భాసమానమ్
సుమల్లికాకుట్మలదంతపఙ్క్తిమ్
మందస్మితోదంచిత గండభాగమ్
శృంగారపుష్పోన్నత నాసికం భజే. ౯

కర్ణాంత విశ్రాంత విశాలనేత్రమ్
కందర్ప ధన్వాయత దీప్తిమంతమ్
సుభ్రూలతా కోమల యుగ్మ భాంతమ్
వందే గురూణాం గురు మప్రమేయమ్. ౧౦

ప్రసన్నభావాన్విత ఛవిశాలమ్
సమ్యక్ప్రపూర్ణ సుధాకరోజ్జ్వలమ్
శోభాకరం నిర్మల వక్త్ర మండలమ్
భక్త్యా మదీయే హృది భావయామి. ౧౧

భజే త్రిపుండ్రాంకిత ఫాలభాగే
సంశోభితాంచత్తిలక ప్రకాశమ్
జటాకిరీటాగ్రనిబద్ధదివ్య
చ్ఛుభ్రాంశురేఖాభరణ ప్రదీప్తమ్. ౧౨

పండిన దొండపండువంటి క్రిందిపెదవిచేఁ బ్రకాశించువాఁడును, మల్లెమొగ్గలవంటి పల్లవరుస గలవాఁడును, చిఱునగవుచే నావరించుకొన్న చెక్కిళ్లుగలవాఁడును, సంపెంగి పూవువలె ఉన్నతమైన ముక్కుగల నాగురుస్వామిని సేవించుచున్నాను. ౯

చెవుల కొనలవరకు నావరించుకొన్న విశాలములగు నేత్రములు గలవాఁడును, మన్మథుని వింటివలె విశాలములయి ప్రకాశించుచున్న కనుబొమల జంటగలవాఁడును, ప్రమేయాది దోషరహితుఁడును, గురువులకు గురువునగు నా గురువును గూర్చి యనుస్మరించుచున్నాను. ౧౦

ప్రసన్న భావముతోఁ గూడుకొన్న బుద్ధివికాసముగలవాఁడును, శరత్కాలమునందు ప్రకాశించుచున్న పూర్ణచంద్రునివంటి పరిశుద్ధమైన ముఖమండలము గలవాఁడును, శోభాకరుఁడునునగు గురువునుగూర్చి భక్తితో నా మనస్సునందు భావించుచున్నాను. ౧౧

త్రిపుండ్రములచే లక్షితమగు ఫాలభాగమునఁ బ్రకాశవంతమగు తిలకముచేఁ బ్రకాశించు వాఁడును, కిరీటమువలె నున్న జడలపైభాగమందు గూర్పఁబడిన చంద్రరేఖయును నాభరణముచేఁ బ్రకాశించు సద్గురుమూర్తిని సే విం చు చున్నాను. ౧౨

వందే సదా నంద మనంత మోశమ్
సమస్త వేదోపనిషద్వ్రజానామ్
ముఖ్యాధినాథం నిజభక్తకోటె
రిభీష్టసంధాయక మాది దేవమ్ ౧౩

ఇత్యేవం గురుదేవస్య
కల్పం విరచితం మయా
స్త్రీవాపి పురుషో వాపి
పఠేన్ముక్తిం వ్రజేత్సదా, ౧౪



సదానంద స్వరూపుఁడును, అనంతుఁడును, ఈశ్వరుఁడును, సమస్త వేదోపనిషత్సమూహమునకు ముఖ్యనాథుఁడును, భక్తుల కోర్కెల నెరవేర్చునట్టివాఁడును, నాదిదేవుఁడునునగు శ్రీ గురుస్వామినిగూర్చి నమస్కరించు చున్నాను. ౧౩

ఇట్లు శ్రీగురుకల్పము నాచేరచింపఁబడినది. దీనిని స్త్రీగాని, పురుషుఁడుగాని పఠించినచో ముక్తినిబొందఁగలరు. ౧౪





ఓం

శ్రీ గురుభ్యోన్నమః

# శ్రీ మదభినవదీక్షితీయే ఉపాసనాకాండే

## ★ శ్రీ గురుకవచం ★

ఓం అస్య శ్రీ సద్గురు కవచస్తోత్ర మహామంత్రస్య-పర బ్రహ్మ ఋషిః, దైవీగాయత్రీ ఛందః; శ్రీ సద్గురు పరమాత్మ దేవతా, ఓంబీజమ్, నమశ్శక్తిః శ్రీభగవతే సద్గురు దేవాయ స్వాహా, ఇతికీలకమ్-మమ పంచదోష తాపత్రయ నివృత్త్యర్థే శ్రీ సద్గురు పరమాత్మకృపా ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః.

—:: అథ కరన్యాసః ::—

ఓం విరాట్స్వరూపాయ అంగుష్ఠాభ్యాం నమః
నమో హిరణ్యగర్భాయ - తర్జనీభ్యాం నమః
శ్రీ భగవతే సద్గురు దేవాయ స్వాహా
అవ్యాకృతాయ - మధ్యమాభ్యాం నమః
ఓం విరాట్స్వరూపాయ అనామికాభ్యాంనమః
నమో హిరణ్యగర్భాయ - కనిష్ఠికాభ్యాంనమః
శ్రీ భగవతే సద్గురు దేవాయస్వాహా
అవ్యాకృతాయ కరతల కరపృష్ఠాభ్యాంనమః.

—♦ అథ హృదయాదిన్యాసః ♦—

ఓం విరాట్స్వరూపాయ – హృదయాయ నమః
నమోహిరణ్యగర్భాయ – శిరసే స్వాహా
శ్రీభగవతే సద్గురుదేవాయ స్వాహా–అవ్యాకృ
తాయ శిఖాయై వషట్
ఓం విరాట్స్వరూపాయ–కవచాయ హుమ్
నమో హిరణ్యగర్భాయ–నేత్రత్రయాయ వౌషట్
శ్రీభగవతే సద్గురుదేవాయ స్వాహా–అవ్యాకృతాయ
అస్త్రాయఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

—* ధ్యానమ్ *—

యో విశ్వరూపో నిజశిష్య పోషో
నిరీశ్వరో సర్వ జగన్నుతశ్చ
స సర్వలోకేశ్వర! దేవదేవ!
శ్రీసద్గురో! త్వాం నిరతం నమామి ౧

అథాచలంపూర్ణమనంత మేకమ్
సర్వాఘ సందోహ విదూర మాఢ్యమ్
అహంస్ఫురత్వాదివికల్ప దూరమ్
వన్దామ్యహం సద్గురు దేవ వర్ష్మమ్. ౨



ఎవఁడు విశ్వరూపుఁడో, ఎవఁడు నిజశిష్యులపోషించు వాఁడో, ఎవఁడు నిరీశ్వరుఁడో, ఎవఁడు సర్వజగములచేఁ గొనియాడఁదగినవాఁడో అట్టి సర్వలోకేశ్వరుఁడవగునో దేవదేవా! ఓ సద్గురుస్వామీ! నిన్నుగూర్చి నిరంతరము నమస్కరించు చున్నాను. ౧

ఇట్లు శ్రీగురుకల్పాంతము - అచలమైనట్టియు, పూర్ణమైనట్టియు, అంతములేనట్టియు, నేకమైనట్టియు, సర్వపాపసమూహము నశింపఁజేయునట్టియు, నేనను స్ఫురణమొదలగు వికల్పములు లేనట్టియునగు సద్గురుస్వామి కవచమునుఁ జెప్పుచున్నాను. ౨

ప్రణమ్య భక్త్యా గురురాజచంద్రమ్
శ్రీరాజయోగాశ్రమ పుణ్యవాసమ్
సంపూర్ణ మాచార్య మయం హి వర్త్మ
వక్ష్యే నృణాం సంతత పాలనీయమ్. ౩

సుఖాసనే స్వస్తిక నామధేయే
ఆసీన సమ్యక్కృత ధీ వికాసః
అతీంద్రియస్థ ప్రాణమనో విజేతా
విచిన్తయే ద్దేశికముఖ్య మాద్యమ్. ౪

సహస్రపంకేరుహ సన్నివేశమ్
చర స్థిరా భ్యంతర పూర్ణతత్త్వమ్
అనుత్త మానన్ద మనన్త మీశమ్
ధ్యాయామ్యహం శ్రీనిజదేశికేంద్రమ్. ౫

విజాతి జాతి స్వగతాది దూరమ్
తథాపి బాహ్యాంతర మధ్యశూన్యమ్
సత్యం శివం సుందర మప్రమేయమ్
నమామ్యహం సద్గురు సార్వభౌమమ్. ౬

రాజయోగాశ్రమ పుణ్యస్థలమందు నివశించునట్టి శ్రీ గురురాజచంద్రునిగూర్చి భక్తితో నమస్కరించి, ఎల్లప్పుడు మానవులఁ బాలించునట్టి సంపూర్ణమైన శ్రీ గురుకవచమును జెప్పుచున్నాను. 3

స్వస్తికమను పేరుగల సుఖాసనమందుఁ గూర్చున్న వాఁడై తెన్నగానుంచుకోనఁబడిన బుద్ధివికాసముగలవాఁడును, ఇంద్రియుని గ్రహముగలవాఁడును, మనోప్రాణముల సరికట్టిన వాఁడును నైకొని మూడఁదగిన దేశికుని తలంచవలెను. ४

సహస్రారకమలమందుఁ గూర్చున్నవాఁడును, స్థావర జంగమాదులయొక్క యుంతర్భాగమునఁ బూర్ణతత్వముగా నున్నవాఁడును, మిక్కిలి యుత్తమస్వరూపుఁడును, ఆనందముగా నున్నవాఁడును, ననంతుఁడును, నీశ్వరుఁడును, నగు శ్రీ నిజదేశికస్వామిని ధ్యానించు చున్నాను. ५

సజాతీయ విజాతీయ స్వగతా విభేదములులేని వాఁడును, లోపల వెలుపల మధ్య భాగములు లేని వాఁ డు ను, సత్యస్వరూపుఁడును, శివస్వరూపుఁడును, సుందర స్వరూపుఁడును, అప్రమేయుఁడును న గు సద్గురు సార్వభౌమునిగూర్చి నేను నమస్కరించు చున్నాను. ౬

యో దేశిక స్సర్వవినాశకాలే
స్వమాశ్రితానా మ్పరతత్త్వ మూలమ్
పరిబోధ పీయూషరసం ప్రదత్తే
సశ్రీగురు ర్మాం నిరతం ప్రపాతు. ౭

ఉత్పత్తిసంహార మహాప్రవాహమ్
సంతీర్య పూర్ణాచల బోధ కోలాత్
శ్రీద్వాదశీభావ సమాహితాత్మా
రక్షాం ప్రకుర్యా త్స్వవచేన సద్గురోః ౮

జన్మప్రవృత్త్యాదిక కర్మజాతే
మృగోపమం మాం కృపయా ప్రపాతు;
శ్రీసద్గురో ర్నామ మహాప్రవాహమ్
మదీయ పాపం నిఖిలం ధునోతు. ౯

సర్వత్ర మాం రక్ష మునిస్థిరాత్మ!
ప్రపూర్ణబోధాచల సద్విచార!
భ్రాంత్యుద్ధతాటోప వికల్ప భీతే
ర్మాముద్ధర శ్రీనిజదేశికేంద్ర! ౧౦

పరిశోధకాలమున తన్నాశ్రయించుకొన్న దీనులకుఁ బరతత్త్వమూలమగు ప్రబోధమను నమృతరస మెవ్వఁడిచ్చు చున్నాఁడో అట్టి శ్రీగురువు నన్నునిరంతరము రక్షించుగాక. ౭

అచల పరిపూర్ణబోధమను తెప్పకొయ్యచే జనన మరణ ప్రవాహమును దాటి, ద్వాదశీభావముచే సమాహిత చిత్తుఁడై సద్గురు కవచముచే రక్షణను బొందవలెను. ౮

జన్మప్రవృత్తులతోఁ గూడుకొన్న కర్మయనువలయందు మృగమువలెనున్న నన్ను (సద్గురుస్వామి) దయతో రక్షించు గాక; సద్గురువుయొక్క నామమను మహాప్రవాహము నాపాప మంతయుఁ బోఁగొట్టునుగాక. ౯

అచల పరిపూర్ణబోధమను సద్విచారముగల వాఁడవును, సమష్టి స్వరూపుఁడవగునో స్వామీ! అంతట నన్ను రక్షింపుము. ఓ నిజదేశికేంద్రా! భ్రాంతియొక్క యుద్ధతియను నాటోపముచేఁ గల్గిన వికల్పముయొక్క భయమునుండి నన్నుఁ గాపాడుము. ౧౦

శ్రీ సద్గురో! సర్వసుపర్వసేవ్య!
అనామయాభ్యంతర బాహ్యపూర్ణ!
విదార్య సంసార మహోగ్ర పాశాన్
మా ముద్ధ రావ్యక్త! దయా సముద్ర! ౧౧

యో భూమిరూపా ర్ఘ్నభూతధాత్రీః
బిభర్తి తన్వష్టక శూన్యమూర్తిః
స దేశికో మే త్వనుకంప దృష్ట్యా
భూమేఘ ప్రదాయాచల పూర్ణబోధమ్ ౧౨

యోబిందు రూపేణ సమస్త లోకాన్
బిభర్తి యుగ్గపాప లతా లవిత్రః
పాయా త్సదా మాం నిరుపాధిక స్సః
జగత్సు చాస్మద్గురు రాజయోగీ. ౧౩

ప్రబోధ సంపూర్ణ సుధా స్వరూపా
త్కరోతి సంజీవన మాశ్రితానామ్
సర్వాత్మ రూపో జ్వల సంవిదాఢ్యః
గురుప్రభు ర్మా మవతా జ్జలేభ్యః ౧౪

సర్వదేవతలచే సేవింపఁబడు వాఁడవును, అనామయుఁడవును, లోపల వెలుపల సంపూర్ణముగానున్న వాఁడవును, అవ్యక్తుఁడవును, దయాసముద్రుఁడవును నగు నో గురుస్వామీ! ఈసంసార ఘోరపాశముల నడలించి నన్ను నుద్ధరింపుము. ౧౧

ఎవఁడు భూమిరూపముతో నీ సర్వ భూతధాత్రిని భరించుచున్నాఁడో, ఎవ్వఁడనిమిది దేహములు లేని స్వరూపము గలవాఁడో, అట్టి సద్గురుస్వామి దయాదృష్టితో నచల పరిపూర్ణబోధనొసఁగి యీభూమినుండి నన్ను కాపాడుఁగాక.

ఎవఁడు బిందురూపముతో సమస్తలోకముల భరించుచున్నాఁడో, ఎవఁడు పాపములను తీగెలకుఁ గొడవలివంటి వాఁడో, ఎవ్వఁడుపాధిశూన్యుఁడో, అట్టి నాగురువగురాజయోగి జగత్తులమందు నన్నెల్లప్పుడు రక్షించుఁగాక. ౧౩

ప్రబోధయును సమ్మృత స్వరూపమునవలన నాశ్రితులకు జీవనమొసఁగు వాఁడును, సర్వాత్మ స్వరూపమగు సంవిత్తుచే గొనియాడఁబడిన సద్గురుప్రభువు జలమునుండి నన్నుఁ గాపాడుఁగాక, ౧౪

అర్ధేందు రూపేణచ పుష్కరేషు
సంజీవనం యశ్చ కరోతి నౄణామ్
యోనిర్వికారః పురుషోత్తమశ్చ
సో మాం జలేభ్యోఽవతు దేశికేంద్రః ౧౫

అమూల దేహాత్మ వికల్ప రూపమ్
భ్రాన్తి స్వరూపోగ్రవనం విదాహ్య
బోధాగ్నినా సద్గురురాజయోగీ
తాపత్రయాగ్నేరపి మాం ప్రపాతు. ౧౬

సర్వాన్ హిలోకాంశ్చ సుకుండలేన
రూపేణ యో నృత్యతి చాంతకాలే
దగ్ధ్వాచ యో భూమిమహోవిలాసో
స చ్ఛానలా ప్రదహతు సద్గురుర్మామ్. ౧౭

మాం పాతు పూర్ణాచల బోధమూర్తిః
సంసార ఝంఝానిల ఘోరపాతాత్
ఛిత్వా మనఃప్రాణ నిగూఢ పాశాన్
పూర్ణప్రసాదామృత బోధహేత్యా. ౧౮

ఎవ్వఁడర్ధచంద్రాకృతితో జలములయందు మానవులకు జీవనమొసఁగుచున్నాఁడో, ఎవఁడు నిర్వికారస్వరూపుఁడగు పురుషోత్తముఁడో అట్టి దేశికేంద్రుఁడు నన్ను జలములనుండి కాపాడుగాక, ౧౫

మూలములేని దేహాత్మలయొక్క వికల్పరూపమగు భ్రాంతి స్వరూపమైన భయంకరారణ్యమును సద్గురుస్వామియగు రాజయోగిబోధయను అగ్నిచే తగులఁబెట్టి తాపత్రయాగ్నినుండి నన్నుఁ గాపాడుగాక. ౧౬

అంత్యకాలమందు సర్వలోకములఁ గుండలాకృతితోఁ గాల్చివైచి యెవఁడు నృత్యమొనర్చుచున్నాఁడో, యెవఁడు విస్తారమగు మహావిలాసుఁడై యున్నాఁడో, అట్టి సద్గురుస్వామి అగ్నినుండి నన్ను గాపాడుగాక. ౧౭

అచల పరిపూర్ణబోధ స్వరూపుఁడగు సద్గురుమూర్తి పెనచుకొనబడిన మనఃప్రాణములను త్రాళ్లను పరిపూర్ణానుగ్రహప్రబోధయను గొప్పఖడ్గముచే ఛేదించి సంసారపు పెనుగాలియను గొప్పపాపమునుండి నన్ను గాపాడుగాక. ౧౮

యోదండరూపేణచ చండవాయో
ర్మధ్యే చర ద్భూత సముచ్చయానామ్
దదాతి చాయు ర్నిగమాంత వేద్యో
స పాతు వాతాదపి దేశికోమామ్. ౧౯

మరుత్పథే నాస్తి యథా ప్రసూనమ్
పూర్ణే తథా సంవి దిమంహి నాస్తి
విద్ధీతి మాం రక్షతు శబ్దదూరో
ఆకాశ జాతోద్ధత నాద భీతేః ౨౦

యో వ్యోమమధ్యే ఘన తారకేణ
రూపేణ ఖేలత్పురుషోత్తమాఖ్యః
ప్రదాయ పూర్ణాచల బోధసారమ్
సశ్రీ గురుర్మా మవతు చాంతరిక్షాత్. ౨౧

వేధాండకోట్యంతర గోళకేషు
ఓంకారరూపేణ విభాసమానః
యోనిర్విశేషశ్చ నిరంజనశ్చ
సర్వత్రమాం సోవతు దేశికేంద్రః ౨౨

ఎవఁడు దండాకృతితో ఝంఝానిలముయొక్క మధ్యభాగమున సంచరించుచున్న భూతకోటికి నాయువు నొసగుచున్నాఁడో అట్టి వేదాంతవేద్యుఁడగు దేశికస్వామి వాయువునుండి నన్ను రక్షించుగాక. ౧౯

ఆకసమందెట్లు పుష్పముండదో, అట్లే పరిపూర్ణమందు ప్రజ్ఞానముండదు అని తెలిసికొమ్మని శబ్దదూరుఁడగు సద్గురుస్వామి ఆకాశమునందు కలిగిన గొప్పభయంకర ధ్వనియొక్క భయము నుండి నన్ను గాపాడుగాక. ౨౦

ఎవఁడు తారకస్వరూపముతో పురుషోత్తమాఖ్యుఁడై యాకసమందు క్రీడించుచున్నాఁడో అట్టిసద్గురుస్వామి అచలపరిపూర్ణబోధనొసఁగి నన్ను నంతరిక్షమునుండి కాపాడుగాక. ౨౧

అనంతకోటి బ్రహ్మాండములయొక్క గోళములయందు నోంకారరూపముతో నెవఁడు ప్రకాశించు చున్నాఁడో ఎవఁడు నిర్విశేషుఁడును, నిరంజనుఁడున్నై యున్నాఁడో, అట్టి దేశికేంద్రుఁడు అంతట నన్ను రక్షించుగాక. ౨౨

నిర్మలచైతన్య వపుస్స్వరూపో
బ్రహ్మాండభాండాంశ్చ పురాకరోతి,
యో దేశికోత్తంస సబోధమూర్తిః
మాం పాతు పూర్వేదిశి సంస్థితస్సః. ౧౩

గజాననో సర్వగణాధిపశ్చ
అనేకదో హ్యేకరదో విభాసతే
సాక్షిస్వరూపశ్చ సదా ప్రపాతు
సశ్రీగురుర్గ ప్రాచిదిశి స్థితో మామ్. ౧౪

యో దేశికాగ్రేసర చక్రవర్తీ
స్వతేజసా ధిక్కృత కాలకామా
ప్రపన్నమార్గం సతతం ప్రదత్తే
సో దక్షిణస్యాం దిశి మాం ప్రపాతు. ౧౫

సనత్కుమారాది మునీంద్ర వంద్యో
యో దక్షిణామూర్తి రసాది దూరః
విద్యాధినాథో దిశి దక్షిణస్యాం
ప్రపాతు చిన్ముద్ర ధరో గురుర్మామ్. ౧౬

ఎవఁడు మూలములేని చైతన్యము యొక్కయు శరీరము యొక్కయు స్వరూపముగలవాఁడై బ్రహ్మాండ భాండమును మొదట నిర్మించెనో అట్టి బోధమూర్తియగు సద్గురుస్వామి తూర్పుదిక్కునందున్నవాఁడై నన్నుఁ గాపాడుఁగాక. ౨౩

సర్వగణములకుఁ బ్రభువుగానున్న వాఁడును, సర్వము నిచ్చువాఁడును, ఒంటిస్లుత్రోఁ బ్రకాశించువాఁడును, సాక్షి స్వరూపుఁడును, ఏనుఁగు మొగముగలవాఁడునునై యెవ్వఁ డున్నాఁడో అట్టి గురుస్వామి తూర్పుదిక్కునందుండి నన్నుఁ గాపాడుఁగాక. ౨౪

ఎవఁడు గురువులలో సార్వభౌముఁడై యున్నాఁడో ఎవఁడు తన తేజస్సుచేఁ గాలకామముల దిక్కరించియున్నాఁడో ఎవఁడు పరిపూర్ణమార్గమును ఎల్లప్పుడిచ్చు చున్నాఁడో అట్టి సద్గురుస్వామి దక్షిణదిక్కునందు నన్నుగాపాడుగాక. ౨౫

ఎవఁడు సనత్కుమారాది మునీంద్రులకు సంస్తుత్యుఁడై యున్నాఁడో, ఎవఁడు దక్షిణామూర్తియో, అసాధుల కెవఁడు దూరుఁడై యున్నాఁడో, ఎవఁడు విద్యలకు ప్రభువో అట్టి చిన్ముద్రధారియగు గురువు దక్షిణపుదిక్కునందు నన్ను గాపాడుగాక. ౨౬

అత్యుద్ధతాన్ వాసనా పాశ జాలాన్
బోధాగ్నికీలైః స్వతతం విదాహ్య
కృపాపరః పాతు దిశి ప్రతీచ్యామ్
శ్రీమద్దయానంద గురు ప్రభు ర్మామ్. ౨౭

సర్వార్థ విజ్ఞాన సుధా ప్రపూర్ణో
యో నిత్యముక్తో విరజాధివాసః
సశ్శ్రీగురుః పండితబృంద సేవ్యో
పాతు ప్రతీచ్యాం దిశి సుస్థితో మామ్. ౨౮

యజ్ఞాంగ పుష్పంచ యథా నజాతమ్
నసంభవ త్యేవహి సంవి దేషా
ఇతీవ సమ్యక్పరిబోధ్య మాం పునః
పాయా దుదీచ్యాం దిశి పూర్ణవిజ్ఞః ౨౯

యో విశ్వగర్భః పరిపూర్ణ వేదీ
అతీంద్రియో నిర్గత షడ్వికారః
శుద్ధః ప్రబుద్ధః పర మాద్వితీయో
మాం పాతు సశ్శ్రీగురు రుత్తరస్యామ్. 30

మిక్కిలియుద్ధతములగు వారుణపాశముల గుంపును, బోధమను అగ్నిజ్వాలలచే కాల్చివేసి దయారూపుఁడగు దయానందదేశికులు పడమటి దిక్కునందు నన్ను కా పా డు గా క. ౨౭

ఎవఁడు సర్వప్రయోజనముల నెఱుఁగుటయును నన్వృతము చేసియుండినవాఁడో, ఎవఁడు నిత్యముక్తుఁడో, ఎవఁడు రజోరహితమందు నివసించువాఁడో అట్టిపండితసేవ్యుఁడగు సద్గురుస్వామి పడమటిదిక్కునందున్నవాఁడై నన్ను గాపాడుగాక. ౨౮

అత్తిచెట్టునం దత్తిపువ్వు ఎట్లు కలుగదో, అట్లే యీ తెలివిగూడ పుట్టునదియే, అని తెన్నుగా బోధించి పూర్ణవిజ్ఞుఁడగు సద్గురుస్వామి న న్ను ఉత్తరపు దిక్కునందు కాపాడుగాక. ౨౯

విశ్వగర్భుఁడును పరిపూర్ణము నెఱిఁగినవాఁడును, ఇంద్రియముల నిగ్రహించినవాఁడును, షడ్వికారముల నరికట్టినవాఁడును, శుద్ధుఁడును, ప్రబుద్ధుఁడునుఁ పరమ స్వరూపమగు నద్వితీయుఁడునై యెవఁడున్నాఁడో అట్టిసద్గురుస్వామి ఉత్తరపు దిక్కునందు నన్ను గాపాడుగాక. ౩౦

అనంత పాదో దర బాహు కంఠయో
రనన్త శీర్షైర్ధృతి నేత్ర నాభిః
అనంతరూపశ్చాపి విరాజమానః
శ్రీసద్గురు స్సోవతు మాం విదిక్షు. ౩౦

శ్రీదేశికో రక్షతు మూర్ధదేశమ్
ప్రపాతు ఫాలం పరమేశ్వరో మే
సూర్యేందు నేత్రో వతు నేత్రయుగ్మే
పాయాన్మనస్వాన్ మదీయ నాసామ్. ౩౧

ఆశాశ్రుతిర్గో పాతు మదీయ కర్ణౌ
పాయాత్కపోలం మమ సుస్వరూపః
ముఖంచ మే సహిమ్నముఖః ప్రపాతు,
జిహ్వాం మమావ్యాత్ త్రిలితేశ జిహ్వః ౩౩

విశుద్ధనాసో మమ కంఠమవ్యాత్
వక్షస్థలం రక్షతు శిష్యపక్షః
పాయాత్కరౌ శ్రీకరయుక్త హస్తో
చిన్ముద్ర పాణి ర్మమ పాణి మవ్యాత్. ౩౪

